# శ్రీ హనుమద్వ్రతం

**మార్గశీర్షే త్రయోదశ్యాం - శుక్లాయాం జనకాత్మజా |**

**దృష్ట్వా దేవీ జగన్మాతా - మహావీరేణ ధీమతా ||**

మృగశిరానక్షత్రం హనుమంతునికి ఇష్టమైనది. భక్త సులభుడైన హను మంతుని అనుగ్రహం పొందటానికి దివ్యమైన మార్గం, మార్గశిర త్రయోద శినాడు హనుమంతుని పూజించి, హనుమంతుని ఆయన శక్తిస్వరూప మైన సువర్చలాదేవిని పంపానదిని కలశంలోకి ఆవాహనచేసి పూజించి, హనుమత్ కథలను శ్రవణం చేసి హనుమత్ ప్రసాదం తీసుకుని వ్రతం పూర్తిచేసుకుంటారు. పదమూడు ముళ్ల తోరాన్ని ధరిస్తారు . ఈవిధంగా పదమూడుసంవత్సరాలు వరుసగా చేస్తే హనుమంతుని సంపూర్ణ అను గ్రహం వ్రతమాచరించిన వారికి కలుగుతుంది అని శాస్త్రవచనం. హను మంతుడు పంపాతీరంలో విహరించేవాడు కాబట్టి ఈ వ్రతాన్ని పంపానదీ తీరంలోనే చేసుకోవాలి. ఇది అందరికీ అసాధ్యం కనుక పంపాతీరానికి బ దులు పంపాకలశం ఏర్పాటు చేసి దాని పక్కనే శ్రీ హనుమద్వ్రతం ఆచరి స్తే హనుమంతుడు పంపాతీరంలో వ్రతం ఆచరించినట్లు సంతోషించి అను గ్రహిస్తాడు.

ఆచమ్య, ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ శ్రీసువర్చలా సామె త హనుమద్వ్రత పూజాంగత్వేన పంపాపూజాం కరిష్యే అని నీటిని తాకా

లి. ముందుగా పంపాకలశ ప్రతిష్ఠాపన చేసి షోడశోపచారాలతో పంపాపూ
జ చేయాలి. పీఠంపై యథాశక్తిగా బియ్యం పోసి పట్టుగుడ్డ పరిచి హను
మంతుని పటాన్ని చక్కని పూలమాలతో అలంకరించి దానిముందు ఐ
దు తమలపాకులు ఒకేరీతిగా పరిచి దానిపై వెండి, రాగి, లేదా కంచు పా
త్ర ఉంచాలి.

'ఇమం మే వరుణ' మంత్రంతో ఆ పాత్రను నీళ్ళతో (పంపానదీ నీళ్ళతో)
నింపాలి.

**ఇమం మే వరుణ శ్రుధీహవమద్యాచ మృడయ**
**త్వామవస్యురాచకే| తత్త్వాయామి బ్రాహ్మణా**
**వందమాన స్తదాశాస్తే యజమానో హవిర్భి:|**
**ఆహేడమానో వరుణేహ బోధ్యురుశగ్ సమానః||**

"ఇమం మే గంగా'' అనే మంత్రంతో ఆ కలశంలోని నీళ్ళను అభిమంత్రిం
చాలి.

**ఇమం మే గంగే యమునే సరస్వతి శతుద్రి స్తోమగ్ం నచతావరుష్ణియా|**

**అసిక్నియా మరుద్వృదౌవితస్థ యార్జీకీయే శృణుహ్యాసుషోమయా||**

తరువాత ఆ పంపాకలశంలో సువర్ణమౌక్తికలు ఉంచి గంధపుష్పాక్షతాల
ను, అష్టగంధ, కర్పూరాలు ఉంచి

**ప్రాం ప్రీం ప్రూం ప్రైం ప్రౌం ప్రః తటిన్యా**
**ద్వాదశ కళా ఇహగాచ్ఛ తాగచ్ఛత||**

**ఓం హం సూర్యమండలాయ ద్వాదశ కళాత్మనే తద్దేవతా కలశాయ న**
**మః**
అని ఆ కలశానికి నమస్కరించి నూతనవస్త్రం చుట్టి కలశానికి 'బృహత్సా
మ' మంత్రంతో రక్షాబంధనం చేయాలి.

**బృహత్సామక్షత్రభృద్వృద్ధ వృష్టియం త్రిష్ణు భౌజశుభిత ముగ్రవీరం!**
**ఇంద్రస్తోమేనా పంచదశేన మధ్యమిదం వాతేన సగరేణ రక్షా||**

**పుష్పాక్షతలు తీసుకుని -**
**ఐం హ్రీం శ్రీం ఓం నమోభగవాతే అశేష తీర్థాలవాలే శివజటాదిరూఢే గంగే**
**గంగాంబికే స్వాహా||**

**సర్వానందకరీ మశేషదురితధ్వంసీం మృగాంకప్రభాం**
**త్ర్యక్షా మూర్ధ్వ కరద్వయేన దధతీం పాశం సృణీం చ క్రమాత్**
**దోర్భ్యాం చామృత పూర్ణకుంభ మవరే ముక్తాక్షమాలా ధరాం**
**గంగా సింధు సరిద్వరాది రచితాం శ్రీతీర్థశక్తిం భజే||**

అని చేతులో ఉన్న పుష్పాక్షతలను కలశంలోని నీటిలో వేసి నమస్కరిం
చాలి.

తరువాత పంపాకలశానికి ప్రాణప్రతిష్ఠ చేయాలి.

**ఓం అనునీతే పునరస్మాసుచక్షుః ప్రాణమిహనోథేహి భోగం**

**జ్యోక్పశ్యేమ సూర్యముచ్చరంత మనుమతే మృడయాన స్వస్తి| అమృ**

**తం**

**వై ప్రాణా అమృతమాపః ప్రాణా నేవ యథాస్థాన ముపహ్వాయతే. పంపాక**

**లశ**

**స్థిత శ్రీ గంగా మహాదేవీ ఇహప్రాణ ఇహజీవ ఇహజీవ ఇహగాచ్ఛ|**

**సర్వేంద్రియాణి సుఖం చిరం తిష్టంతు స్వాహా||**

**స్థిరభవ|| వరదాభవ| సుముఖీభవ| సుప్రసన్నా భవ| ప్రసీద ప్రసీద ప్ర**

**సీద||**

అని ప్రాణప్రతిష్ఠ చేసిన తరువాత పంపాకలశ పూజ చేయాలి.

శౌనకాది మహర్షులు సూత మహర్షిని శ్రీ హనుమ ఉద్భవాన్ని వివరించ
మని కోరారు. అప్పుడు ఆయన కథ చెప్పాడు. వ్యాస మహర్షి ఒకసారి
ద్వైతవనంలో వున్న పాండవుల దగ్గరకు వచ్చాడు. ధర్మరాజు, భార్య ద్రౌ
పదితో, సోదరులు సహా ఎదురు వెళ్ళి స్వాగతం చెప్పి లోపలికి ఆహ్వానిం
చి అర్ఘ్యపాద్యాలు యిచ్చి భక్తిశ్రద్ధలతో సేవించాడు. వ్యాసుడు సంతోషించి
ద్రౌపది పాతివ్రత్యాన్ని మెచ్చాడు. అందరు భక్తీ శ్రద్ధలతో చేయవలసిన ప్ర

తం వుందని దాన్ని వివరించాడు. అది కార్య సిద్ధిని కలిగిస్తుందనీ, వెంట నే ఫలితం లభిస్తుందని చెప్పాడు. అదే శ్రీ హనుమద్ వ్రతం. దుష్ట గ్రహా ల్ని, వ్యాధుల్ని పోగొట్టి సకల శుభాలు, శ్రేయస్సు ఇస్తుందని దాన్ని ఆచ రించి మళ్ళీ రాజ్యాన్ని పొందమని ఉపదేశించాడు. పూర్వం ఈ వ్రతాన్ని శ్రీ కృష్ణుడు ద్రౌపదికి బోధించి, దగ్గర వుండి వ్రతం చేయించాడని దాని ప్ర భావం వల్లనే పాండవులకు అఖిల సంపదలు లభించాయని చెప్పాడు. అయితే ఒకసారి అర్జునుడు ద్రౌపది చేతికి వున్న హనుమత్ తోరణాన్ని చూసి దాని వివరం అడిగాడు. ఆమె అన్నీ వివరంగా చెప్పగా, అతడికి గ ర్వం కలగటంతో కోతిని గూర్చిన వ్రతం ఏమిటని ఈసడించాడు. తన జెం డాపై కట్టబడ్డ వాడు, ఒక వానరుడు అయిన హనుమకు వ్రతం చేయట మేమిటని దుర్భాషలాడాడు. ఆమె ఏడుస్తూ తన అన్న శ్రీ కృష్ణుడు చె ప్పి చేయించిన వ్రతం ఇది అని చెప్పింది. అయినా అర్జునుడి కోపం తగ్గ లేదు. ఆమె చేతికున్న తోరాన్ని బలవంతంగా లాగి పారవేశాడు. అప్పటి నుంచి పాండవులకు కష్టాలు ప్రారంభమైనాయనీ ఈ అరణ్య, అజ్ఞాత వా సాలు దాని ఫలితమేనని వ్యాసుడు ధర్మరాజుకు చెప్పాడు. పదమూడు ముడులు గల హనుమత్ తోరాన్ని తీసివేయటం వల్లే పదమూడు ఏళ్ళ అరణ్య, అజ్ఞాతవాసం అని వివరించాడు. కనుక వెంటనే హనుమత్ వ్రతం చేయమని హితవు చెప్పాడు. ధర్మరాజుకు సందేహం కలిగింది. పూర్వం ఎవరైనా ఈ వ్రతం చేసి ఫలితం పొందారా అని అడిగాడు. దానికి సమాధా నంగా వ్యాసుడు ఒక కథ చెప్పాడు. పూర్వం శ్రీ రాముడు సీతను వెదుకు

తూ, తమ్ముడు లక్ష్మణునితో ఋష్యమూక పర్వతం చేరాడు. సుగ్రీవ, హనుమలతో సఖ్యం చేశాడు. అప్పుడు హనుమ రామునితో తన వృత్తాంతం అంతా చెబుతూ, దేవతలంతా తనకు ఎలాంటి వరాలు ప్రదానం చేశారో వివరించాడు. బ్రహ్మాదిదేవతలు హనుమతో ''హనుమా ! నువ్వు హనుమద్వ్రతానికి నాయకుడిగా ఉంటావు. నిన్ను ఎవరు భక్తిశ్రద్ధలతో పూజించి వ్రతం చేస్తారో వారి కోరికలన్నీ నువ్వు తీరుస్తావు'' అని బ్రహ్మ చెప్పిన మాటను రాముడికి చెప్పి నేను నీ బంటునని తేలిగ్గా చూడక నా వ్రతం చేసి ఫలితం పొందు. త్వరలో సీతాదర్శనం కలిగి రావణ సంహారం చేసి అయోధ్యాపతివి అవుతావు అని విన్నవించాడు హనుమ. అప్పుడు ఆకాశవాణి ''హనుమ చెప్పినదంతా సత్యమైనదే'' అని పలికింది. వ్రత విధానం చెప్పమని హనుమను రాముడు కోరాగా, మార్గశిర శుక్ల త్రయోదశి నాడు హనుమత్ వ్రతం చేయాలని హనుమ చెప్పాడు. పంపా నదీతీరంలో శ్రీరాముడు సుగ్రీవాదులతో వ్రతం చేశాడు. పదమూడు ముళ్ళ తోరను పూజించి కట్టుకొన్నాడు. కాబట్టి సందేహం లేకుండా ధర్మరాజాదులను ఈ వ్రతం వెంటనే చేయమన్నాడు వ్యాసుడు. వ్యాసమహర్షి మాటలకు సంతృప్తులై ధర్మరాజు, భార్య, సోదరులతో వ్రతాన్ని విధివిధానంగా చేసి అంతా తోరాలు భక్తి శ్రద్ధలతో కట్టుకొన్నారు.